శ్రీ

# ద్వారకాపతి శతకము





ఇది

విశాఖపట్టణముజిల్లా, బొబ్బిలితాలూకా, అజ్జాడవాస్తవ్యులగు

శ్రీమదాదిభట్ల శ్రీరామమూర్తి కవిచే

రచింపఁబడినది



కృష్ణాజిల్లా కైకలూరుతాలూకా శోభనాద్రిపురం అగ్రహారవాస్తవ్యులగు

బ్రి. శ్రీ కాశీనాధుని సుబ్బారావుగారి

ద్రవ్యసహాయమున

ముద్రించి ప్రచురింపఁబడెను.

శ్రీ

# ద్వారకాపతి శతకము.

ఇది

విశాఖపట్టణముజిల్లా, బొబ్బిలితాలూకా, అజ్జాడవాస్తవ్యులగు

శ్రీమదాదిభట్ల శ్రీరామమూర్తి కవిచే

రచింపఁబడి

కృష్ణా జిల్లా కైకలూరుతాలూకా శోభనాద్రిపురం అగ్రహారవాస్తవ్యులగు

బ్ర. శ్రీ కాశీనాథుని సుబ్బారావుగారి

ద్రవ్య సహాయమున

బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

కుందా లక్ష్మీనరసయ్యచే

ముద్రించి ప్రచురింపఁబడియున్నది.

1942

మొదటికూర్పు 500 ప్రతులు



[వెల 0-4-0

ఏకం సత్ విప్రా బహుధా వదంతి.

కర్మణ్యే వాధికారస్తే
మా ఫలేషు కదాచన
మాకర్మఫలహేతుర్భూ
మా తే సంగో స్త్వకర్మణి.

సర్వ భూతస్థ మాత్మానం
సర్వ భూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా
సర్వత్ర సమదర్శనః.

# ఆశీస్సు

సీ॥ ఆత్రేయపావన ◆ గోత్రకాశీనాథ
నాగలింగారాధ్య ◆ నయగుణుండు
తాత శ్రీ లలితాంబ ◆ ప్రీతిఁ జేకొనె వారి
కాత్మసంభవుఁడు మ◆ల్లయ్యసూరి
అన్నపూర్ణ గృహిణి ◆ యాతని కగు వారి
సుతుఁడు సుబ్బారావు ◆ సుజనహితుఁడు
ననుకూలవతి సద్గు◆ణాలయ మహాలక్ష్మి
ధర్మపత్నిగను హ◆స్తంబువట్టె

తే॥ గీ॥ ధనకనక వస్తు వస్త్రవా◆హనము లొసఁగి
తాతతండ్రులవలె ధర్మ◆తత్పరుఁడయి
దాతయై వారి మించి ప్ర◆ఖ్యాతిఁగాంచెఁ
ద్వారకాపతి యితనిఁ గా◆పాడుఁగాత.

ఇట్లు,
గ్రంథకర్త.

# పీఠిక

బ్రహ్మశ్రీ ఆదిభట్ల శ్రీరామమూర్తిగారి చేత రచింపఁబడిన శ్రీమద్రామాయణ గీతమాలికలు అందందు చదివితిని. ధార అనర్గళముగా నున్నది. ఇంత గ్రంథములు ఒకటి రకారప్రాసము, ఒకటి మకారప్రాసముతోఁ గుంటు లేకుండ, రసము చెడకుండ వ్రాయుట, సామాన్యులు చేయలేని పని. దీని కెంత యోపిక కావలయునో భగవంతుని కెఱుక. అందులో నాద్యంతము నొక్కఁడే మొక్కవోని మధువాహినిగాఁ బ్రసరింపఁ జేయుట పూర్వపుణ్య విశేషము. వీరి రామాయణ కీర్తనలు రమ్యాతిరమ్యములు. సుబ్రహ్మణ్య కవి యధ్యాత్మరామాయణమునకు వన్నె పెట్టిన ట్లున్నవి. ఇది గాక వీరి యితర గ్రంథములును, గీతాకావ్యము, నారాయణ శతకమును, వీరి పాండిత్యము, గడుసుందనము, ప్రతిభను వెల్లడించుచున్నవి. వీరు క్రమాంతస్వాధ్యాయులు, అమోఘ జ్యోతిషపాండిత్యము కలవారు. ఏతాదృశగుణగరిష్ఠులు భగవత్కృపాపాత్రులు. వీరు గుండెకు సూటిగా మాటాడుదురు. అట్టి ప్రకృతి స్వామికి దగ్గఱగా నున్నది. ఇందొక్క యక్షరమును అతిశయోక్తి కాదు.

విశ్వనాథ సత్యనారాయణ,

బెజవాడ.

13—3—42.

# ద్వారకాపతి శతకము



ఉ॥ శ్రీరమణీమనోహర! వి♦శేషకృపాకర! యాదవాన్వయో
దారపయోధిశీతకర! ♦ దానవదూర! వినమ్రదాసమం
దార! మదాంధ చైద్యముఖ♦దర్పకుఠార! కళిందనందినీ
తీరవిహార! గోపవర♦ధీర! వశీకర! ద్వారకాపతీ.

ఉ॥ విఘ్నములేకమత్కృతి, వి♦వేకులు సంతసమొందియుండ, ని
ర్విఘ్నముగాసమాప్తినెఱ♦వేర్పఁగణాధిపు మ్రొక్కి కొల్తు, శ్రీ
నిఘ్న మదీయవాంఛితము♦నెమ్మిని దీర్చి కృతార్థుఁజేసి, శ
త్రుఘ్న! మహాత్మ!నన్నుఁబరి♦తుష్టుని సల్పవె,ద్వారకాపతీ.

చ॥ కరముల నాలుగింట,వర♦కంజముఁ బొత్తము నక్షమాల సం
బరముగ వీణఁ దాలిచి, శు♦భమ్ముగఁ బాటను బాడు వాణి ని
బ్బరముగ నాదునాల్క ని♦లువంగ భజించెద,మంచిపల్కులం
దొరలించి, నన్నుఁబ్రోచి, పరి♦తుష్టుని జేయఁగ ద్వారకాపతీ.

చ॥ చతురకవిత్వసంస్కృతవి♦శారదు నాదికవీంద్రు నెంచి స
న్మతిఁదలపోసి, వ్యాసునిగ్ర♦మమ్ముగ గొల్చుచుఁ గాళిదాసు భా
రతకవులందలంచి, మదిఁ♦ బ్రౌఢులఁ బోతనముఖ్యులందఱిన్
స్తుతులొనరించి వేడెద, వ♦సుంధర నే నిను ద్వారకాపతీ.

చ॥ అల సిరి లచ్చి తేండ్లన మ♦హాత్ములు,జ్ఞానులు,నాదు తల్లి దం
డ్రులకు నమస్కరింపుచు, ని♦రూఢిగ మద్గురుసేవ సల్పి యు
జ్జ్వలమగుభక్తి నాకిడ ధ్రు♦వమ్ముగఁ గోరి మదాత్మశుద్ధి ని
శ్చలమగు బుద్ధి నిన్ గొలుతుఁ♦జక్కగ నాకిడు ద్వారకాపతీ.

ఉ॥ రాజిత కీర్తిశాలి, ముని♦రాజు కృపారసవార్ధి, యాభర
ద్వాజయమీంద్రుఁడయ్యనఘు♦వంశమునంజనియించె,విద్యనం
భోజభవుండొనాఁగ నుతిఁ♦బొందిన రామయ లక్ష్మిభర్త ని
ర్వ్యాజుఁడుమత్పితామహుఁడు♦త్యాగియుదారుఁడు ద్వారకాపతీ

ఉ॥ ధీయుతుఁడౌచు లక్ష్మయను♦దివ్యపదంబునఁగూడి యొప్పినా
రాయణుఁడన్న పేరున వి♦రాజిలువాఁ డవధాని శ్రీయుపా
ధ్యాయుల వేంకటార్యునకుఁ♦దత్సతి సుబ్బమకుందనూజకా
త్యాయనిసాటిపాపమయుఁ♦దల్లియుఁ దండ్రియు ద్వారకాపతీ.

ఉ॥ వేఁడుచు నున్నవాఁడ నినుఁ♦వేయువిధమ్ముల నన్నుఁ బ్రీతిఁగా
పాడుము రామమూర్తి యను♦వాఁడ భవత్పదసేవకుండ నీ
వాఁడను నీవె నా కెపుడుఁ♦బ్రోవని నమ్మిక నున్నవాఁడ న
ట్టాడపురీనివాసకుఁడ ♦ సాధువిధేయుఁడ ద్వారకాపతీ.

ఉ॥ పూనిక నీకుఁ బద్యశత♦మున్ రచియించి యొసంగ దాని స
మ్మానముతోడలోననను♦మానసము మానిపరిగ్రహించియా
భానుని శశితారకముగ ♦ బాలన సేయు మనశ్వరాయువుం
బూని వెలుంగునట్లు పరి♦పూర్ణకృపం గని ద్వారకాపతీ.

చ॥ నలువయి సృష్టి సల్పితి జనార్దను పేరిటఁ బెంచుచుంటి వీ
వలరఁగఁ జంద్రశేఖరుఁడ♦వై నశియింపఁగఁబుచ్చుచుంటి ని
ర్మలముగ మూఁడు పేరులఁ గ్ర♦మమ్ముగ వృత్తులఁ బొందియుంటి ని
శ్చలముగఁ గాంచ నొంటివగు♦సామివి నీవెగ, ద్వారకాపతీ.

చ॥ సరసిజసూతి వేదములఁ♦జౌర్యతఁ గైకొని సోమకుండు ము
ష్కరుఁడు వార్ధిడాఁగ మొల♦సారసగర్భుఁడిడంగ నీవు ని

బ్బరమగు మీనరూపమున ♦ వారిధిఁజొచ్చి సురారిఁద్రుంచి సం
బరముగఁ బ్రౌనుడుల్ వడసి ♦ బ్రహ్మకొసంగితి ద్వారకాపతీ.

ఉ॥ గ్రానము మందర మ్మసుర ♦ కాండము వేల్పులు పట్టి వార్ధి సం
భావనఁ ద్రచ్చఁ బర్వతము ♦ భారముగాఁగ విడంగ వారలున్
నీవును గూర్మరూపమున ♦ నెమ్మిగ గిరిన్ భరియించి తేల్చి యా
దేవగణాన కీ విడితి ♦ తేకువ నా సుధ ద్వారకాపతీ.

చ॥ కుటిలుఁడు హేమలోచనుఁడు ♦ కుంభినిఁజాపఁగఁ జుట్టిపట్టియు
త్కటుఁడయిపోవుచోనమర ♦ కాండముసీకడ మొఱ్ఱవెట్టఁగాఁ
గిటియవయి కోలలం బెరిచి ♦ కేశవ యాహవ మాచరించి యా
కుటిలుని ద్రుంచి నీవపుడు ♦ క్షోణిని నిల్పితి ద్వారకాపతీ.

ఉ॥ నీదగు పాదభక్తిని జ ♦ నింపకమున్పటినుండి కొల్చుఁ బ్ర
హ్లాదు హిరణ్యకశ్యపుఁడు ♦ రచ్చల కెక్కుచు బాధవెట్ట స
మ్మోదుఁడవౌచు బాలకుని ♦ మోదమున న్పాలయింపనెంచి పె
ల్లాదట దైత్యుఁదున్మి దను ♦ జార్భకుఁ బ్రోచితి ద్వారకాపతీ.

చ॥ అడిగితి వామనుండవయి ♦ యా బలి మూఁడుపదాల నేల న
ప్పుడె వడిఁగుబ్జరూపువిడి ♦ భూమి నొకడ్గునఁ గొంచు వేఱ యొ
క్కడుగున మిన్నుఁ గైకొని ♦ కాశుఁడవౌచును మూడవడ్గునా
యెడ బలిమస్తమందిడి ర ♦ హింబలిఁ ద్రొక్కితి ద్వారకాపతీ.

చ॥ పరశువు కేలఁబూని నర ♦ పాలుర నిర్వదియొక్కసారి సం
హారణమొనర్చి నల్లను స ♦ యమ్ముగఁ బైతృకతృప్తిసల్పియు
త్తతిభృగురామదాతవయి ♦ ధాత్రిని గశ్యపమౌని కిచ్చి సు
స్థిరతరకీర్తిఁ గాంచితివి ♦ చెప్పెడి దెయ్యది ద్వారకాపతీ.

ఉ॥ రావణ కుంభకర్ణముఖ ♦ రాక్షసబాధల కోపలేక, యా
దేవగణమ్ము నిన్ను విను♦తింపఁగ నంతఁ గృపాంబురాశివై
భూవరుఁడైన పఙ్క్తిరథు♦పుత్త్రుఁడవై జనియించి, రాముఁడ
నీవు దశాస్యముఖ్యులవ♦నింబడఁగూల్చితి ద్వారకాపతీ.

చ॥ అల వసుదేవుచే జనన♦మందుచు రోహిణి కల్ల దేవకీ
లలనకు ముద్దుఁజూపుచు వి♦లాసములన్ బలరామకృష్ణులై
యలరుచు మేనులందున సి♦తాసితవర్ణములందు నొంటివై
యిలభర మెల్ల మాన్పి రిపు♦హీనను జేసితి ద్వారకాపతీ.

చ॥ మతములపాడి వీడి పలు♦మాయ లొనర్చి యనేకరీతులై
శ్రుతిగతులం జరింపక వ♦సుంధరఁ జూడఁగ నెల్లవారు దు
ర్మతులయియుండియుండియప♦మార్గములంజరియింపబుద్ధియా
క్షితి వెలయంగఁ బాడి పరి♦శీలన నిల్పితి ద్వారకాపతీ.

చ॥ కలియుగమైన వెన్క నృప♦కాండము దొంగలరీతిగాను సం
చలన మొనర్చి భూములనొ♦సంగెడివారలఁదుంపనెంచి ని
ర్మలమగు వెల్ల తేజిని బి♦రానను నెక్కి మహాసి కేల నీ
వలరఁగఁబూని రాజులన♦యారె వధింతట ద్వారకాపతీ.

ఉ॥ దేవకి గర్భమందు వసు♦దేవునిచే జననమ్ముఁ జెంది సం
భావన పారిజాత మన ♦ భాసురమంగళ వేదశాస్త్ర శో
భావహమైన శాఖల న♦నంత సుఖాళి జనాళి కిచ్చుచుం
జీవనదానకర్తవయి ♦ జీవనమిచ్చెదు ద్వారకాపతీ.

చ॥ సురమణికోర్కెలెన్నొ యిడు♦చున్ సురకోటినిఁ బ్రోచునట్టులీ
శ్వర ! వరదాయకుండ వయి ♦ సర్వచరాచరజీవకోటి నీ

వరయుచు జీవనమ్ముల మ♦హాత్ముఁడవై యిడి కాంతుపీవుమ
ద్వరము నొసంగి భక్తు ననుఁ♦ బాలనఁ జేయవె ద్వారకాపతీ.

ఉ॥ వేల్పులగిడ్డి వేల్పుల న♦వీనపు బువ్వలఁ బెట్టిప్రోచు నా
వేల్పుల వేల్పవౌదువు ప్ర♦వీణుఁడవౌచును నీవు నాగరా
ట్తల్పశయాన! నాకు లలి♦తంబగు నీ పదభక్తి నిచ్చి య
త్యల్పపుఁ గోర్కె భక్తుననుఁ♦దన్పినఁదప్పదె! ద్వారకాపతీ.

చ॥ అడుగును దాటనీయను మ♦హాత్ముఁడవై ననుఁబ్రోవకున్న ని
న్వడిగ మదీయభక్తి యను♦పాశము నీదుపదాలకున్ ముడిన్
జడియక నేను వైవఁగను ♦ సాగుటదెట్లగు నీకు, నీవు ని
య్యెడ నభయమ్ము దానమిడ♦ వేనియు నిన్ విడ ద్వారకాపతీ.

ఉ॥ మోదమె నీకు వేదపరి♦పూర్ణులఁ గాంచిన నెంతొ శాస్త్రసం
వాదులఁ జూడ సంతసమె ♦ పండితభాషల విన్ననీవు నా
హ్లాదుఁడవౌదు వింకను వి♦వాదమటన్నను కాలుఁద్రవ్వెదా
కాదను మాట గెల్తువు ప్ర♦కాశతఁ జెందగ ద్వారకాపతీ.

చ॥ కృపణపుబుద్ధిమాని పరి♦కింపుము చెల్లఁగ నాదు ముద్దు, నీ
కపయశ మబ్బు ప్రొద్దు, పరి♦హార మొనర్పుము, నీవురద్దు నా
చపలతసద్దు నీవిఁకను ♦ జాలము సేయక కోర్కెదిద్దు, నీ
కృపకును హద్దుఁ గాననొక♦యింతయొసంగుము ద్వారకాపతీ.

ఉ॥ పోడిమిదప్పకున్నఁ బరి♦పూర్ణసుఖమ్ములఁ బొందుదంట నీ
వాడినమాటఁ దప్పక న♦యమ్మగుపాడిన చూతువంట తు
న్మాడుచు దుష్టులం జగతి ♦ మాదృశదీనులఁ బ్రోచెదంట వి
న్నాఁడను నీదు భక్తుఁడ న♦నాథునిఁ గావవె ద్వారకాపతీ.

చ॥ నిలువఁగఁ గొంపలేదు మది ♦ నీపదభక్తిని వీడఁబోదు చం
చలతను బొట్టకూటికిని ♦ సంచరణమ్మును సేయ వాదు ని
శ్చలముగ నొక్కతావున వి♦చారములేకను నిన్నుఁగొల్వ ని
ర్మల భవదీయభక్తినిడు♦మా కృపఁ గొల్చెద ద్వారకాపతీ.

ఉ॥ శాత్రవశిక్ష సల్పఁగ వి♦చక్షణదక్షుఁడవౌదు వీవు, నా
క్షాత్రపుఁజిహ్న లొందుచువి♦శాలయశుండవు కావె చూడను
క్షేత్రవరుండ వీవికి వి♦శేషదయాళుఁడవౌదు వెన్న ని
ద్ధాత్రిని భక్తునన్నొకనిఁ ♦ దన్పుట కష్టమె ద్వారకాపతీ.

చ॥ దనుజుఁడు సర్పరూపమున♦ దాలిచి క్రూరతఁ గాననాంతరం
బునఁ బడియుండి గోపకుల♦భోరున మ్రింగెడునప్డు వారు వే
డినఁ గరుణించునట్టులు గ♦డింది భయార్తుని నన్నుఁగావ ని
న్ననవరతంబుఁ గొల్చెద ద♦యామతిఁ జూడుము ద్వారకాపతీ.

ఉ॥ జంకక దుష్టులన్న రిపు♦సంఘ మటన్నను నీవెదిర్చి ని
శ్శంకను వారిఁ ద్రుంతువు వి♦శంకటశక్తిని నాదుశత్రులఁ
బింకము లూడునట్టు, లతి♦వేగముగా నొనరించి మించి యో
పంకజనాభ! ప్రోచి నను ♦ బజ్జను జేర్చవె ద్వారకాపతీ.

ఉ॥ గోవుల గోపబాలకుల ♦ గోపికల న్గడుచిచ్చు చుట్టి దే
వా! వడి నిన్ను మొఱ్ఱలిడ♦ వారలఁ గావఁగఁ జిచ్చుమ్రింగి నీ
వావిధి వారిఁ బ్రోచితివి♦యట్టులె నా వెతచిచ్చు మ్రింగి త్వ
త్సేవకు నన్నుఁ జొన్పి కృపఁ♦ జెచ్చెరఁ బ్రోవవె ద్వారకాపతీ.

చ॥ కులము పవిత్రమయ్యె యదు♦కుంజర! నీవుదయమ్మునందనీ
వలనయశమ్ము వచ్చె రిపు♦వర్గము నొయ్యనఁ ద్రుంచియుంట వ్యా

కులము నశించె గోవులకుఁ ♦ గోరికవచ్చెడి మేతలెచ్చె వి
ప్రులు పరితుష్టిఁజెందిరి మోక్షఱుంగులు గల్గుట ద్వారకాపతీ.

ఉ॥ ఏటికి మేనుపెంచ నతి♦హీనపు వృత్తుల నల్పి కాటికే
నాటికి నీదుభక్తియు జ♦నార్దన! కొల్వఁగ నాకొసంగి యీ
పాటికిఁ త్వత్పదాబ్జయుగళ♦భక్తునిఁజేరిచి ప్రోవకున్న ము
మ్మాటికి నిన్నువీడను సుక్షమా! దరిగాంచర ద్వారకాపతీ.

ఉ॥ లంచముమెక్కి నైజము వి♦లాసము నీకది బాల్యమిత్రుఁడై
వంచన లచ్చిసేయఁ దన♦పత్నియు బాములఁబెట్టియడ్కులే
కొంచెము మూటగా ముడిచి♦కోమలిపుచ్చగ మూటవిప్పి భ
క్షించుచు నా కుచేలు సిరిఁ♦జేర్చుచుఁ బంపవె ద్వారకాపతీ.

ఉ॥ కొంటెతనమ్ముఁ బూనుచును♦ గూనపయస్సునమండినీవు వా
ల్గంటుల గొల్లచేడెల వి♦కారపుఁజేష్టల సల్పునట్టి బల్
తుంటరి జారనాయకుఁడు♦దొంగవటంచు వచింత్రునిన్నహో
వింటిని వేదవాక్యముల ♦ వీడను నిన్నెద ద్వారకాపతీ.

ఉ॥ త్రాతవటంట భక్తుల ను♦దారమనీషను బ్రోచితంట వి
ఖ్యాతుఁడు విప్రవర్యుఁడగు ♦ కశ్యపమౌనికి భూమినిచ్చి సం
ప్రీతునిఁ జేసియుంటివట♦ రే నను పోషణఁ జేయలేవె నీ
దాతృత భక్తుపై నెఱప ♦ దప్పాట నీకెటు ద్వారకాపతీ.

ఉ॥ దొంగలలోన దొంగవయి♦తుంటరివౌచును వెన్నదొంగవై
రంగఁడవన్న కీరితి వి♦రాజిలుటెట్లగు, నన్నుఁ బ్రోవ న
త్సంగుఁడవౌదు, భక్తునెడఁ♦దామసముంగొని ప్రోవకుండిన
న్భంగమునంది నీయశ మ♦వారిని మాయదె ద్వారకాపతీ.

చ॥ సిరికి మగండవౌచుఁ బరి♦శీలన భక్తునిఁ బ్రోవకున్న, నీ
సరసత యెట్లు నిల్చు, జల♦జప్రియకోటిసమాన తేజ! పెం
సిరులును సంపదల్ మెయివి♦శేషములెల్లను శాశ్వతమ్మొకో
పరగతి నాకు నీ విడు ను♦పాయముఁ జూపవె ద్వారకాపతీ.

ఉ॥ జారతనమ్ము కూడదని♦చాటితి వేదములందు, శాస్త్ర సం
స్కారములందు వ్రేఁతలను♦జక్కఁగఁ గ్రీడల దేలియుంట, పిం
జారితనమ్ము కాదె యటు♦సల్పితి, చెప్పఁగ బెద్దవౌచు, నా
తీరునఁ జేయఁ బాడియె, ధృ♦తిన్ మది వీడుచు ద్వారకాపతీ.

ఉ॥ దానమొసంగ నిచ్చ పరి♦ధానములీయఁగఁ దృష్టి జ్ఞానసం
ధానమటన్న మోదముని♦దానపుశాంతముసొత్తు కార్యసం
ధానము గానమున్ భవదు♦దారగుణంబులు భక్తపాలన
స్థానము లాటపట్లు నను ♦ సాకఁగలేవటె ద్వారకాపతీ.

చ॥ పరమ పతివ్రతామణుల♦భక్తగణమ్ములఁ బ్రీతి దాపసో
త్కరములఁ బ్రోవనుంటి నని♦కంకణమేలను గట్టికొంటి ని
బ్బరముగ నీవ్రతమ్మున క♦పాయముఁ జెందక భక్తుఁడౌననుం
జిరభవదీయ కీర్తిదరిఁ♦జేరిచి ప్రోవుము ద్వారకాపతీ.

ఉ॥ న్యాయము కాదు నన్ విడన♦నాథునిఁ బ్రోచుటిదెంత నీకుఁ బ్రా
ధేయుఁడనౌచు వేడితి వి♦ధేయతఁ జెందుచు నెంతొ నిన్ను శ్రీ
నాయక ! నీకు నియ్యది ఘన♦మ్మగుఁ గాదటె భక్తుఁ బ్రోవన
డాయఁగ రమ్ము కీరితి దృ♦ఢమ్ముగ నీకగు ద్వారకాపతీ.

చ॥ కలను జరించునప్పుడు సు♦ఖమ్ములవెట్టులు కల్లలౌనొ యీ
కలిమియు సౌఖ్యసంతతి జ♦గాన నటే క్షణభంగురమ్ము చం

చలము భవత్పదాబ్జయుగ♦సారవు భక్తియె శాశ్వతమ్ముని
శ్చలమగు భక్తి నా కిడు ర♦సాస్థలిఁగొల్చెద ద్వారకాపతీ.

ఉ॥ దారముకూర్చు పుష్పములఁదండగతిఁ వసియించి జీవులం
దారయ నీవె యంతట మ♦హాత్ముఁడవై చరియించి జీవనా
ధారుఁడవౌదు వందరికిఁ♦దప్పక యట్టిడవౌచు నాకు నా
హారము వెట్టకుందువె య♦యారె విరుద్ధము ద్వారకాపతీ.

ఉ॥ సోకులమారి వందురి, మధు♦సూదన! నీ కపకీర్తి, భక్తిచే
నాకలిఁ దీర్చు భక్తు నన♦యమ్ముగ నీవటు సేయవేని నీ
జోకులు గొల్ల చేడియలు♦ చూచుట కేకద దాల్చియుంట పో
పోకిరివంచు నిన్ననరె ♦ భూమిని భక్తులు, ద్వారకాపతీ.

చ॥ పరుసపుఁజిన్కు నాయసము♦పైఁబడనాయసరూపుమారి బం
గరు వెటులౌనో యట్టులనె ♦ కల్మషముండెగనాడివేయ నీ
కరుణ రవంత నాపయిని ♦ గల్గినఁజాలును, దానఁజేసి, నేఁ
గరము పవిత్రముం గొనుచు♦గౌరవమందెద, ద్వారకాపతీ.

ఉ॥ క్రూరుఁడు బాలిశుండు నతి♦కోపుఁడటంచును నన్ను నెంచి నా
నేరము లెన్ని పీడినను♦నేర్పరివంచును నిన్ను నెంత్రె యా
క్రూరునిఁ గోపిఁబాపి, యదు♦కుంజరప్రోచుటె నీఘనమ్మనిం
డారయశమ్మువచ్చునను, దృ♦ఢమ్ముగ నీ కిల ద్వారకాపతీ.

చ॥ వరమిడ దుస్తరమ్ము బహు♦భంగుల భక్తునిమానసమ్ముని
బ్బరమెటులుండునోయనిధ్రు♦వమ్ముగనీవు పరీక్షసల్పి యా
వరమిడుదీవు శాశ్వతమ♦పాయముఁబొందదునిన్నుఁగొల్తుద్వాఁ
చ్చరణములుండ, నీసిరియు♦సంపద లేలను, ద్వారకాపతీ.

ఉ॥ పేదకుఁ బొట్టనిండె, రిపు◆వేదన లెల్లడ నారియుండె ని
మ్మేదినిఁబంటపండెఁగడు◆మేలగుధర్మము హెచ్చుచుండె నిం
డాదరమున్ గ్రహించెను జ◆నార్దనుఁ డీవయి పుట్టియుండ న
న్నీదరిఁ జేర్చి కావుము గ◆ణింతును నే నిను ద్వారకాపతీ.

చ॥ శరణని వేడియుండిన వి◆చక్షణతం గని భక్తుపైని నీ
సరసతఁ జూపవైతివి వి◆శాలయశమ్మెటు లబ్బె నీకు ని
ష్ఠురములువల్కఁగోపముక◆డున్వహియించెదవీవదెంతొ నీ
యురమదిఱాయియేమొవిన◆యోక్తులకుబ్బవుద్వారకాపతీ.

ఉ॥ శ్లేషలఁ జెల్లు కబ్బము బ◆లే యన విందురు పండితాళి నా
శ్లేషల కిచ్చగించెదరు◆చేడియ లెంతయొ యాజివాద్యసం
ఘోషలవీరులుబ్బెదరు◆గొప్పగ యుక్తిమృదూక్తి పద్యసం
భాషల కాలకించెదరు◆బాగుగ లోకులు ద్వారకాపతీ.

చ॥ పరపతి లేద నీదుపద◆భక్తునిఁ బ్రేముడి నేద లచ్చికి
న్వరుఁడవె కాద నా మొఱవి◆నం జెవి కెంతయుఁ జేద సజ్జనా
దరణ మొనర్పరాద వర◆దా! శుభదాయక భవ్యపాద!దు
ర్భరరిపుభేద వేడెదఁ గృ◆పన్ నను గాంచుము ద్వారకాపతీ.

ఉ॥ దీనుల రక్షసల్పఁగఁ బ్ర◆తిజ్ఞ గలాడవు ప్రతిజ్ఞయందు సం
ధానుఁడవౌచు జీవులయ◆థార్థమునం గృపఁ బ్రోచికాతు స
మ్మానసమానవీక్షణము◆మాన్యతఁ గాంచ నొసంగి నీపద
ధ్యానము నాకు నిచ్చుచు ర◆యమ్మున బ్రోవవె ద్వారకాపతీ.

ఉ॥ చర్వితచర్వణమ్ముల వి◆చారము లేమికి భక్తి లేమి నీ
యుర్వినిఁ బుట్టిచచ్చుచున◆యోపచరించెదుకర్మసంఘమున్

గర్వితచిత్తులై సలుపఁ♦గాఁదలపోయుచు నుంద్రుగాని యా
సర్వసుఖమ్ములున్ సిరులు♦సాటియె భక్తికి, ద్వారకాపతీ

చ॥ చతురుఁడ వౌదుసామమున♦సాహసివెన్నఁగ దానమందు స
మ్మతమగుభేదమందునస♦మర్థుఁడ వెంతయు దండనమ్ము సం
గతిఁ గనిపెట్టి సల్పెదవు♦నాల్గు నుపాయములందు నీవెకా
చతురుఁడ వన్న పేరు కొన♦సాగితి విద్ధర ద్వారకాపతీ.

ఉ॥ మాయలనెంతొ వైరులవ♦మానములం బచరింపుచుంటప్రా
ధేయత నిన్నుఁ జెందెడి వి♦ధిం జరియింపుచు భీతివార ల
త్యాయతశ్రద్ధ నీదగుప♦దద్వయిభృత్యతఁ గొల్చునట్టులం
జేయుదు వంట నీవు పరి♦శీలన సల్పుచు ద్వారకాపతీ.

చ॥ తలలను మార్పొనర్చెదు వి♦ధమ్మున కీవతిప్రౌఢుఁడౌచు ను
జ్జ్వలమగు దిట్టవీవని సె♦బాసని మెచ్చి జనుల్ నుతింప వై
రులఁ బరిమార్చి కీరితిని ♦ రూఢిగ వాసికి నెక్కియుంటివే
యిలఁబరికింప నీకు సము♦లేరును గారుగ ద్వారకాపతీ.

ఉ॥ జుట్టుల ముళ్ళిడంగ మధు♦సూదన! నీవతిప్రౌఢుఁడౌదు
జెట్టివి కౌరవాన్వయముఁ♦జీల్చితి రాజ్యము పాండవాళికిం
దిట్టరివౌచు నిచ్చితి వ♦దేగతి కోరికఁ దీర్చవేని నీ
గుట్టు జగాన నంతు యదు♦కుంజర! యింకను ద్వారకాపతీ.

ఉ॥ బూటకమాడనమ్ము పరి♦పూర్తిగ భక్తునిపల్కునమ్ము జం
జాటముఁగాదు లెమ్ము కృప♦సాకుచుఁ గోరికలిమ్ము నాజగ
న్నాటకసూత్రధారివయి♦సన్ఘనమేయిఁక గాచికొమ్ము నేఁ
జాలెదఁ జేతఁగాని పురు♦షప్రపశుండని ద్వారకాపతీ.

చ॥ పరుసములాడియుంటి బహు◆భంగుల వానిని సైచి నీవు నీ
కరుణను నాపయిం బఱపి◆ కావుము నాదగు కోర్కెఁదీర్పు మి
త్తఱి భవదీయభక్తుఁడను ◆ తామసముంచకు పుత్రుపైని నీ
నిరుపమవత్సలత్వమును◆నిండుగఁ జూపుము ద్వారకాపతీ.

ఉ॥ వేసము లేలపోయెదు వి◆వేకునిలక్షణ మద్దికాదు సే
బాసుర పోకిరీ వనరె ◆ భక్తగణమ్ములు నిన్నుఁగూర్చి సం
తోసముతోడ గొల్చెదరె ◆ తుష్టుగ నన్నుఁకసల్పవేన్ రసా
భాసముఁగాదె నీదుపద◆భక్తుడఁ బ్రోవుము ద్వారకాపతీ.

ఉ॥ గొల్లలయిండ్లదూరి యదు◆కుంజర! చల్లలబుడ్లచిల్లు లీ
వల్లరిసల్పి పెట్టెదవ◆హో మొఱవెట్టుచు గొల్లలెల్ల నీ
తల్లి యశోదతోనుడువఁ◆దథ్యము కాదని కల్లలాడు నా
యల్లరి వీవ భక్తు నన◆యమ్మను జూచెదె ద్వారకాపతీ.

చ॥ రసికుఁడవౌదు భక్తు నను ◆ రక్షణసల్పిన సల్పకున్న నీ
రసికత యెట్లునిల్చును బి◆రాసను నిందలముంచువాఁడ బెం
పెసఁగ నకీర్తివచ్చునట◆హీనముఁగాదె యటైన నీవు నా
దెసఁగృపఁజూపిప్రోవుము ను◆తించెద నే నిను ద్వారకాపతీ.

ఉ॥ బంధురవిక్రముండు తన◆బాహుబల మ్మనిఁజూపుచుఁ జరా
సంధుఁడు నీపయిం గవయ ◆ సంగరమందున నోడిపాటి నీ
బంధులఁగూడి ధైర్యమెడఁ◆బాసెకునీవెటునన్నుఁబ్రోతువో
కంధరదేహ నాకదియె ◆ కష్టముఁదోఁచెదు ద్వారకాపతీ.

ఉ॥ కాలునిఁబోలి యుగ్రిలయ◆కారుఁ డనంగను జన్యశీలివై
కాలునుదువ్వి నీపయికిఁ ◆ గాలతురుష్కుఁడురాఁగ నీవు న

క్కాలమునందుధైర్యమువి♦కావికలై చనఁబాఱియుంటి వి
క్కాలమునందునన్నెటులు♦గాచెదొ తోఁచదు ద్వారకాపతీ.

చ॥ పరుసములన్ వచించితిని ♦ భావమునందునఁ గోపమెంచ కీ
ధ్ధరణిని వానిఁద్రోయఁదలి♦దండ్రులు దేశికదైవతమ్ము లం
చరయఁగ నిన్నె నమ్మితి న♦యమ్ముగ దోసములంద్యజించి నీ
చరణయుగాబ్జసేవ నిడి ♦ సాకుము నన్నిఁక ద్వారకాపతీ.

ఉ॥ కల్లలువల్కనాఁడవు జ♦గమ్మున నిన్ దయఁజూడ నింతలోఁ
జెల్లదు కొన్నినాళ్ళయినఁ ♦ జెప్పెదనంచు వచింతువేని, నే
నొల్ల విలంబనమ్మునకు ♦ నోపికపట్టుమటందు వయ్యయో
పిల్లికి నాట మూషకపు♦బిల్లకుఁ జేటగు ద్వారకాపతీ.

చ॥ అపగతకిల్బిషుండవు మ♦హాత్ముఁడ వెయ్యెడ నట్టినిన్ను నా
చపలపువాంఛఁగూర్చి కడు♦నల్పతి నిందల వానిఁదోసి నీ
నిపుణత నాదుకోర్కులిడి ♦ నీరజలోచన నీదుభక్తి స
త్కృపనునొసంగినన్నిఁకను♦ దేల్పుము మ్రొక్కెద, ద్వారకాపతీ.

ఉ॥ ఆలనుగాచువాఁడ, నయ♦మారెను గొల్లలజోడుకాఁడ నిం
డాలములోని ప్రోడ, యవు♦రా బొలిగద్దను నెక్కువాఁడ ఘో
కాలము బత్తులన్ మిగులఁ ♦గాచెదు వేల్పులఱేనిఱేఁడ, స
న్నాపలసల్పు నల్లగొల♦వాఁడ, నుతించెద, ద్వారకాపతీ.

ఉ॥ అన్నలమిన్న ద్రోవది స♦భాంతరమందున మానభంగ మా
తెన్నునఁ గౌరవుల్ సలుప ♦ దిక్కటలేకను నిన్ను వేడ, బ్ర
చ్ఛన్నత నక్షయమ్మని ప్ర♦శస్తత వల్వలొసంగి ప్రోచు సం
పన్నుఁడవీవు, దీను ననుఁ ♦ బాలనసేయువె, ద్వారకాపతీ.

చ॥ నిపుణతవిద్యఁజెప్పు గురు♦నిం గురుదక్షిణఁగోరుమన్న సాం
దిపుఁడుసముద్రగామిసుతుఁ♦దెచ్చియొసంగుమటన్న బ్రీతిఁగా
లు పురికినేగి బాలకు బ♦లుండవునై కొనితెచ్చియెంతొ నీ
కృప సుతుదేశికోత్తముస ♦ కిచ్చుచుఁ దన్పితి,ద్వారకాపతీ

ఉ॥ కోకలువిప్పి యొడ్డునను ♦ గుప్పలువెట్టుచు గోపికాంగనల్
తేఁకువమీఱ నీరమున ♦ లీలలనాడెడు వేళఁ జీరలన్
వీఁకను మ్రుచ్చిలించి, కడు ♦ వేగ, నమేరువునెక్కిడాగ, నా
ళీకముఖుల్ కనుంగొని, చ♦లింపఁగ వారికి జ్ఞానబోధ మ
స్తోకతఁ జల్పినట్టి నిను ♦ స్తోత్రముఁ జేసెద ద్వారకాపతీ.

చ॥ నలువమొదల్ సమస్తస్వ జ♦నమ్మునయందునునిల్చియుండు నీ
చెలిమి చరాచరమ్ములగు ♦ జీవులకెంతయొ జీవనమ్ము నీ
విలసనమెల్ల ప్రాణులకు ♦ విశ్రుత తేజము, నన్నుఁబ్రోవఁగా
దలఁపమిపెద్దలోపమిది ♦ తథ్యము తథ్యము, ద్వారకాపతీ.

చ॥ దురమున హస్తియమ్మకరి♦తోడను బోరొనరించుచున్న న
త్తఱి కరిరాజుడస్సి వర♦దా! పరమేశ్వర! కావుమంచు నీ
చరణములన్ భజింప వడిఁ♦జక్రముచే మకరిన్ వధించి స
త్కరుణను సామజేంద్రునిలఁ♦గాచితి వెంతయు ద్వారకాపతీ.

ఉ॥ చుట్టమె హస్తిరాజు మధు♦సూదన యావిధిబ్రోచి నీవు చే
పట్టితివల్లె భక్తు నను ♦ బాలన సల్పుము సల్పవేని నీ
గుట్టును బైటఁబెట్టెదను ♦ గొబ్బున నిందల లోకమందు నీ
కట్టులు రట్టు భక్తుని ర♦యమ్మునఁ బ్రోవుము ద్వారకాపతీ.

చ॥ పరుఁడని భక్తునన్నుఁ బరి♦పాలన సల్పిన పాపమొక్కొ నీ
కరుణను భక్తులన్ మునుపు♦గాచితి వంటదికల్ల సుమ్ము ని
బ్బరముగ నీవుపల్కుమటు♦పాడియె పక్షముఁబూనన్యాయమే
పరువునుగాచికొమ్ము ననుఁ♦ బాలన సల్పక ద్వారకాపతీ.

ఉ॥ పేదవె నన్నుఁబ్రోవఁగ వి♦వేచన భక్తునిఁ గావరాదె సం
వాద మదేల నాకడ ధ్రు♦వంబుగ నండ ఘటిల్లఁ జాలు నీ
పాదయుగంబె దిక్కు పెఱ♦వారినిఁ గోరను బ్రోవకున్న నిన్
గాదనిపింతు భక్తజన♦కాండము సన్నిధి ద్వారకాపతీ.

ఉ॥ క్రూరపుజింతఁగంసుఁ డతి♦కోపమునన్ నినుఁజంపనెంచి యా
క్రూరుని నీకుఁగాఁ బనుపఁ♦గూరిమి నాతనిఁగూడివచ్చి న
ద్దారిని నీ స్వరూపము హి♦తమ్ముగ నీటను నీవుచూపి య
క్రూరుఁడె యాతఁడంచతని♦కోర్కులొసంగితి ద్వారకాపతీ.

ఉ॥ బోటియశోద నీదు నడు♦మున్ బిగిత్రాటను ఱోటఁగట్ట నీ
వాటల మద్దిచెట్లనడి♦యాటల ఱోటను దారుచుండ జం
ఝాటన పాటవోన్నతిని♦సాలయుగమ్ము విఱుంగ శాపము
చ్చాటనగాఁగ వారికి ని♦జాకృతు లిచ్చితి ద్వారకాపతీ.

చ॥ తరువుల శాప మావిధి ము♦దమ్ముగ నీవతివేగఁద్రుంచి నీ
కరుణ నిజాకృతుల్ వడయఁ♦గా నొనరించితి నిన్నుఁగొల్వ న
ట్లరయ భవత్పదమ్ములన♦యమ్ముగఁ గొల్చెడిభక్తినిచ్చి నా
దురితములం దొలంచి ననుఁ♦దుష్టినిఁబ్రోవవె ద్వారకాపతీ.

ఉ॥ పాతకి కంసుఁడెంతయు న♦పాయము నీకొనరింపనెంచి యా
పూతనఁబంపఁ జన్గవను ♦ బూరితిగాను విసమ్ముఁదాల్చి య

న్నాతి బిరానవచ్చి కరు♦ణం జనుఁబాలిడ దుష్టయైన య
ప్పూతనఁజంపి దానికిని ♦ మోక్షమొసంగితి ద్వారకాపతీ.

చ॥ కపటమొనర్చి నిన్ దునుమఁ♦గాఁదలపోసిన చెట్టఁగాను నే
నెపమిడి చన్గవన్ విసము♦నింపి యొసంగిన దుష్టఁగాను ఘో
రపుఁబెనుమంటలం జఱపి♦ప్రాణముఁదీయఁ దలంచు చిచ్చుగా
నపరిమితప్రసాదమున♦నాత్మభటుంగను ద్వారకాపతీ.

ఉ॥ ఎంతయునాయసమ్ముగ్రహి♦యించిదటిన్ వడిఁజేర్చునాయయః
కాంతము రీతిగా సతముఁ♦గల్మషుఁడైనఁ ద్వదీయచింతనం
బింతయొనర్ప భక్తుని గ్రహింపుచు వానియఘమ్ముఁద్రుంచి నీ
చెంతకుఁ జేర్తువంట నయ♦శీలతఁ బ్రోచుచు ద్వారకాపతీ.

చ॥ తఱియిది వాసుదేవ! ననుఁ♦దన్నుట కెంతయుఁదాళజాల నీ
చరణసరోజయుగ్మపువి♦శంకటభక్తిని నా కొసంగి నా
దురితములం దొలంచి పరి♦తుష్టిగ నిన్ను భజించునట్లు నీ
కరుణను భక్తు నాపయిని♦గాఢముగా నిడు ద్వారకాపతీ.

ఉ॥ దోసము లేని యంబరిషుఁ♦దోరపు భక్తిఁ బరీక్ష సేయ దు
ర్వాసుఁడువచ్చియావ్రతము♦భంగమొనర్పఁగనెంచనాతనిం
గాసిలఁ జేసి యానృపతిఁ♦గాచి ముదంబిడునట్లె నన్ను నీ
దాసుని దోషదూరునిగఁ♦దద్దయుఁ జేయుము ద్వారకాపతీ.

చ॥ మడువున నున్కిగా నిలిచి♦మారుతభోక్త సమస్తజీవులం
గడఁక విషాగ్నికీలలను ♦ గాల్పఁ దదీయశిరః ప్రదేశమం
దడుగులువెట్టితొ్రక్కఁగఁ ద♦దంగన లెల్లరు వేడ వారికిం
గడఁ బతిభిక్ష పెట్టితివి♦కాదె ముదమ్మున ద్వారకాపతీ.

ఉ॥ ఫుల్లసరోజనేత్ర! పరి♦పూర్ణజలాంబుదగాత్ర శాంభవీ
వల్లభమిత్ర! లోకనుతి♦పాత్ర! మహోఘలతాలవిత్ర! స
ద్భల్లకపత్త్రి చిత్రతర♦దామవిదర్భసుతాకళత్ర! రా
జిల్లెడు త్వత్కృపారస ముఁ♦జిందవె నాపయి ద్వారకాపతీ.

చ॥ ఖగపతివాహ స్నిగ్ధఘన♦కాంతిసముజ్జ్వల నీలదేహ ప
త్రిగన[illegible]థాధిరోహ భుజ♦దర్పితదైత్యవనప్రదాహ స
న్నిగమసమూహసంస్తుత వి♦నిర్మలపాదజనిప్రవాహ భ
క్తగణ సుపర్వమూహా! నను♦దారకుఁబ్రోవవెద్వారకాపతీ.

ఉ॥ సాంద్రయశోవిశాల గుణ♦జాల సుశీల కృపాలవాల ని
స్తంద్రసువర్ణచేల ముని♦సత్తమచిత్తనివాసఖేల మా
నీంద్రసురారికాల ఘన♦నీల వినీలకపోల నాకవా
సేంద్రముఖప్రపాల నను ♦ నిత్తఱిఁ బ్రోవవె, ద్వారకాపతీ.

చ॥ స్మరహరమిత్ర పంకరుహ♦శాత్రవభాస్కరయుగ్మనేత్ర సు
స్థిరనుతిపాత్ర భక్తజన♦చిత్తవిసర్పితపంకమిత్ర వి
స్ఫురితసువర్ణనేత్ర భవ♦మోచనసూత్ర రమాకళత్ర యం
బరవితతాతపత్ర ననుఁ ♦ బాలనసేయవె ద్వారకాపతీ.

ఉ॥ యాదవవంశదీప కరు♦ణాంచితదివ్యకలాకలాప వి
చ్ఛేదితభక్తతాప పరి♦శీలితపుణ్యజనానులోప స
మ్మోదితభవ్యరూప పరి♦పూరితపాండవరక్షణానుసం
పాదితవిశ్వరూప ననుఁ ♦ బాలన సేయవె, ద్వారకాపతీ.

చ॥ సరహితరథ్యచోదక జ♦నార్దననామక భక్తచిత్తపం
జరనిలయస్థభవ్యశుక ♦ సజ్జనపోషక మోక్షదాయకా

తరణినిశాకరాంబక కృతఘ్నవినాశక దైత్యకాననో
త్కరదహనప్రపావక సతమ్మను బ్రోవవె ద్వారకాపతీ.

చ॥ పరమపవిత్రనామ యదువంశపయోనిధిపూర్ణసోమ సం
గరరిపుభీమ భక్తజనకాండమనోరథపూర్ణకామ ము
ష్కరభుజవిక్రమక్రమనిశాచరగర్వవిరామ చంద్రభా
స్కరనయనాభిరామ నిను సన్నుతిఁజేసెద ద్వారకాపతీ.

ఉ॥ గోపకులాగ్రగణ్య రణకోవిదపణ్య యగణ్యపుణ్య సాం
దీపిశరణ్యపణ్య కమనీయపదాంబుజజాతపుణ్య దు
ష్ప్రాపమహాపరాక్రమపరాజితపుణ్యజనేడ్వరేణ్య స
త్త్వాపరిహాసపణ్య కృపఁ దన్పుము నన్నిఁక ద్వారకాపతీ.

చ॥ నిరుపమతేజ భక్తగణనీయ సుభక్తినియుక్తపూజ సం
గరకరిరాజమానసవికాసవరామరభూజ పూతస
చ్చరణసరోజసంజనితశైవలినీపరిపూతదేవతా
సరససమాజ భక్తు నను సాకవె నీకృప ద్వారకాపతీ.

ఉ॥ బాలశశాంకఫాల యదువంశనృపాల సువర్ణచేల స
మ్మేళితవార్ధిఖేల గుణమేదుర సజ్జనపాల భానుసం
పాలనరత్నకుండల విభాధివిభాసికపోల బాల స
చ్ఛీల యశోవిశాల ననుఁ జేర్పుము నీకృప ద్వారకాపతీ.

చ॥ సరసిజపత్రలోచన విచారవినాశన నందనందనా
కరధృతశంఖచక్రవరఖడ్గగదాఘన భక్తచందనా
సురుచిరలోకవందన విశుద్ధమనోధనమాఁనికుర్దనా
దురితవిమర్దనా కరుణతో ననుఁ గావవె ద్వారకాపతీ.

ఉ॥ సూనృతభాష నీలఘన♦సుందరవేష యశోవిశేష సు
జ్ఞానమహావిభూష వర♦కౌస్తుభసన్మణికాంతిపూష సం
ధానిత సర్వభక్తవర♦దానకతోష యశేషలోకదు
ర్మానితభూరిదోష నను ♦ మన్నుము నీకృప ద్వారకాపతీ.

చ॥ దురితవిదూర భక్తజన♦తుష్టకృపాపరిపూర సారవి
స్ఫురితకటాక్షధార పరి♦శోభితగోపకిశోర గోపికా
వరతరుణీవిషాదభవ♦బంధవిదార! యుదార! దుగ్ధసా
గరసువిహార ధీర కృపఁ♦ గాంచుము నాపయి ద్వారకాపతీ.

ఉ॥ పాండవరక్షదక్ష సుర♦పక్షమునీద్యబుధారిశిక్ష యా
ఖండలముఖ్యనిర్జరని♦కాయసమక్షకృపాకటాక్ష బ్ర
హ్మాండభరైకదీక్ష ♦ కలుషావృతవిష్టపముక్తి భిక్ష వే
దండ భయప్రమోక్ష ననుఁ♦దన్పవె నీకృప, ద్వారకాపతీ.

ఉ॥ గోపరిపాల కాంచనదు♦కూల సమస్తకళానుకూల వి
ద్యాపరిపాలశీల యమ♦రారివనోత్కటదావకీల సం
తాపితశత్రుజాల వర♦ధర్మనిరంతరగర్భగోళ యు
ద్దీపితగోపబాల కృపఁ ♦ దేల్పవె నన్నిఁక ద్వారకాపతీ.

చ॥ అలరెడు చంపకోత్పలము♦లాదట దండగఁ గూర్చి త్వత్పదం
బులఁ గడు భక్తివెట్టితి ప్ర♦మోదమనంబున స్వీకరించి నీ
కలుషములెల్లఁ బాసె నిఁక ♦ గాదిలిభక్తుఁడవైతి వంచు నా
తలపయి నీకరంబు నిడి ♦ తద్దయుఁ బ్రోవుము, ద్వారకాపతీ.

ఉ॥ తప్పులుగల్గ సామమును♦దండ్రి వచించును వెన్క దానముం
జొప్పడ సేయు భేదమును♦జూపును మీఁదఁ బయింబొనర్చు దా

నప్పుడు దండనంబు పరమాత్మ గురుండవు నీవె కావ నా
చొప్పున బుత్రునిన్ వను విశుద్ధునిఁ జేయవె ద్వారకాపతీ.

ఉ॥ నోటికి వచ్చినట్టులు నిను న్నుతియించితిఁ దప్పులున్న నా
సాటిభటప్రకాండములఁ జాటక యొంటిగ నున్నయుక్తు నా
చోటికి వచ్చి తెల్లముగఁ జూపుము దానికిఁ బ్రీతిలేనిచోఁ
జాటుగ స్వప్నమందయిన సల్పుము దిద్దెద ద్వారకాపతీ.

ఉ॥ ధర్మము మీఱకుండ ఫలితంబున నాసఁ దొలంచి శ్రద్ధమైఁ
గర్మ లొనర్చుటే? నరసుఖంబని చేసిన బోధ వింటి నా
దుర్మమతల్ త్యజించికొని తోఁచిన యట్లు శతంబు పద్యస
త్కర్మ మొనర్చి నాఁడ ఫలితంబుఁ దలంతునె ద్వారకాపతీ.

చ॥ నెలకుఁ ద్రివృష్టి నించి ధరణిన్ వహియింపఁగ సస్యవృద్ధిగో
వులు పృథివీసురుల్ సుఖముఁ బొంద నిలాధిప వైరహీనమై
కలిమియుఁ జెల్మియుండ జనకాండముఁ దక్కిన సర్వజీవులు
జ్వలవముదమ్మునందఁ గృపఁ బాలనఁ జేయవె ద్వారకాపతీ.

చ॥ యువయను నేట మాధవసితోత్ప్రతిపత్పరవాసరాంతమం
దవిరళభక్తిఁ డావకపదాంబుజయుగ్మసదర్చ నేయ నే
వ్రివిమలపద్యపుష్పములు బాగుగనూటొకయెన్మిదింటి మా
ధవ యిడియుంటిఁ గొంచుననుఁ దన్పవె నీకృప ద్వారకాపతీ.

సంపూర్ణము.

# బ్రి. ఆదిభట్ల శ్రీరామమూర్తిచే రచియింపఁబడిన

# గ్రంథముల పట్టిక



గ్రంథముపేరు — అచ్చువేయించినవారు

1. ముకుందశతకము : బ్రి. కాశీనాథుని వీరమల్లయ్యారాధ్యులవారు, యలకుర్రు
2. లోకనాయక శతకము : రాజశ్రీ సీమకుర్తి మల్లికార్జున శ్రేష్ఠిగారు ఏలూరు
3. విష్ణుపాద శతకము : రాజశ్రీ అప్పన లక్ష్మయ్యగుప్తగారు, ఏలూరు
4. మార్తాండ శతకము : అచ్చుపడ నున్నది.
5. ద్వారకాపతి శతకము : బ్రి. కాశీనాథుని సుబ్బారావుగారు, శోభనాద్రిపురం అగ్రహారం
6. అప్పన శతకము : అచ్చుపడ నున్నది.
7. శ్రీకృష్ణ శతకము : బ్రి. తూములూరి వేంకటప్పయ్య శర్మగారు, ఉరుటూరు
8. మహేశ శతకము : బ్రి. దూబగంటి రామకోటయ్యగారు, కైకలూరు
9. నారాయణ శతకము : ద్వ్యర్థి బ్రి. కాశీనాధుని చినవీరమల్లయారాధ్యులు వగైరా, శోభనాద్రిపురం అగ్రహారం
10. దామోదర శతకము : అచ్చుపడ నున్నది.
11. అజామిళోపాఖ్యానము : హరికథ, అచ్చుపడవలయును.
12. శ్రీమదభినవరామాయణము : పంచత్రింశత్సాశ్వాస సమన్వితం బగు గేయ ప్రబంధము, అచ్చుపడనున్నది. దంటుసుబ్బావధానులుగారికి నివ్వబడియె. బెజవాడ.
13. రామాయణ సప్తకాండోత్పల మాలిక : (ర. మ అను రెండు ప్రాసాక్షరములమీద వ్రాయఁబడినది) శ్రీ జయపుర సంస్థానాధీశ్వరులగు శ్రీ శ్రీ శ్రీ విక్రమ దేవవర్మ మహారాజావారిచే సచ్ఛాత్రింప వాగ్దాన మొనర్పఁబడినది.
14. నారాయణదాస కీర్తికాంతాగళబద్ధ కాలపాశము : అచ్చుపడనుండెను.
15. నారాయణదాస కీర్తిదుష్కృత్యదావానలము : అచ్చుపడనుండెను.